

## ఆత్మజ్ఞానలబ్ధికీ, అమృతత్వసిద్ధికీ అవశ్యానుమంతవ్యం

# శ్రీ ఐతరేయోపనిషత్తు

డా॥ ఏల్చూరి మురళీధరరావు

బహ్వృచోపనిషదమనే నామాంతరం కలిగిన ఐతరేయోపనిషత్తు ఋగ్వేదానికి చెందిన ఐతరేయారణ్యకంలో ఒక విశిష్టమైన భాగం. ఈ ఐతరేయారణ్యకం ఇప్పటికి కనీసం రెండువేల ఆరువందల సంవత్సరాలకు పూర్వకాలంలో ఉద్భవిల్లినదని ఆధునిక పరిశోధకులు నిర్ణయించారు. ఐతరేయాభిధానంతో వెలసిన ఋగ్వేదీయ బ్రాహ్మణానికి, ఆరణ్యకానికి కర్త మహిదాస ఐతరేయుడని ఊహింపబడుతున్నది. ఛాందోగ్యోపనిషత్తు* కథనాన్ని బట్టి ఈ పురుషయజ్ఞోపాసకుడు 116 సంవత్సరాలు జీవించినట్లు తెలుస్తున్నది. మాధవాచార్యుడు ఇతను విశాలాత్మజుడని, సాక్షాత్తు శ్రీమన్నారాయణుని అవతారమని పేర్కొన్నాడు. సాయణాచార్యుడు మహిదాసుని తల్లిపేరు 'ఇతర' అని వేరొక గాథను ఉదాహరించాడు. మహిదాసుని తండ్రి ఇతరను నిరాదరించి, అన్యభార్యలయందు తనకు కలిగిన సుతులను ఆప్యాయనంగా లాలించేవాడట. ఒకానొకప్పుడు యజ్ఞశాలలో ఋషులందరూ ఉపవిష్టులై ఉన్న సమయాన మహిదాసుడు తండ్రి తొడమీద కూర్చొనబోగా నలుగురిలో అతనికి అవమానం జరిగింది. ఇతర తన కొడుకు మనోవేదనను గ్రహించి, ఇష్టదేవతను ప్రార్థించింది. భూదేవి ప్రసన్నురాలై దివ్యరూపంలో సాక్షాత్కరించి మహిదాసునికి సారమండలనివేశాన్ని కల్పించి, అప్రతిహతమైన విజ్ఞానాన్ని ప్రసాదించింది. ఆ విధంగా జ్ఞానోదయం కలిగిన ఐతరేయుడు అనంతరకాలంలో తనపేరిట వెలసిన వేదభాగాన్ని దర్శించాడట. ఈ కథాకథనంలో ప్రసక్తమైన 'ఇతర' - 'దాస' శబ్దాల ధ్వనితార్థాలను పరిశీలించి కొంతమంది విమర్శకులు మహిదాసుడు జన్మతః ద్విజుడు కాడని; తపోవ్రతుడై దైవకృపవలన మహర్షిపదాన్ని అధిగమించాడని భావిస్తున్నారు.

ఐతరేయారణ్యకంలో అయిదు ఖండాలు ఉన్నాయి. ఒక్కొక్క ఖండానికీ మళ్ళీ ఆరణ్యకమనే పేరు. వేదకాలంలో ఆత్మతేజోదృష్టప్రత్యయులైన మహర్షితల్లజుల మహోదాత్త వేదాంత తత్త్వభావనల సారాన్ని మనకు ఈ గ్రంథం కరతలామలకంగా ప్రకాశింపజేస్తున్నది. ఇందులోని మొదటి ఆరణ్యకంలో 'మహావ్రత' శబ్ద నిరుక్తితోపాటు శాస్త్రసంహతిని గూర్చిన - అంటే, ఐతరేయ బ్రాహ్మణం 1-38, 4 4 లలో ఉపదేశింపబడిన గవామయన సత్త్ర మహా

* ఏతద్ధ స్మ వై తద్విద్వానాహ మహిదాస ఐతరేయః స కిం మ ఏతదుపతపసి యోఽహమనేన న ప్రేష్యామీతి స హ షోడశం వర్షశత మజీవత్ప్ర హ షోడశం వర్షశతం జీవతి య ఏవగ్ం వేద.

(ఛాందోగ్య. 3 - 167)



వ్రతానుష్ఠానానికి ఆవశ్యకాలైన ఔషస మాధ్యాహ్నిక సాయంసవన మంత్రాల సిద్ధిదర్శనం ఉన్నది. ఆ వ్రతాచరణకు సంబంధించిన వివరణ ఈ ఆరణ్యకంలో వివిధప్రతీకలతో రూపకప్రత్యాయకంగా కనుపిస్తుంది. అసలు ఆరణ్యక రచనా సంవిధానంలోని ముఖ్యోద్దేశం ఇదే: వైదిక కర్మకలాపాలలోని రహస్యార్థాలను కథాముఖంగా విప్పిచెప్పటం. కాలక్రమేణ భగవదారాధన క్రమంలో కర్మానుష్ఠానం, ధ్యానధారణ అన్నవి స్వతంత్రమార్గాలుగా ఏర్పడిన తర్వాత, ఆరణ్యకం వానప్రస్థాన్ని స్వీకరించిన మోక్షకాములు ఆత్మతేజాన్ని ఉద్దీపింప జేయటానికి ఏమిచేయాలో ఉపదేశించే అమోఘమైన శాస్త్రసంహితగా రూపుదిద్దుకొన్నది. అందుచేతనే ఇందులో అగ్నిహోత్రవిధులతోపాటు సర్వకర్మలను పరిత్యజించి, ధ్యానమార్గంలో స్వాత్మచైతన్యాన్ని దర్శించిన యోగీంద్రుల విజ్ఞానసారం నిక్షిప్తమై ఉన్నది. గ్రంథారంభంలోనే కాథికుడు 'బ్రహ్మ వై గాయత్రీ బ్రహ్మైతదహః' అంటూ గాయత్రీమంత్ర, మహావ్రతాహాలలో బ్రహ్మానుసంధానం చేయటం దీని సర్వాత్మభావనకు నిదర్శనమని చెప్పవచ్చు. ఋగ్వేదం దశమ మండలంలోని 27-వ సూక్తాన్ని దర్శించిన ఋషిని గురించి వివరిస్తూ, ఆరణ్యకం - 'త ద్వాసుక్రం, బ్రహ్మ వై వసుక్రో, బ్రహ్మైతదహః, బ్రహ్మైవ తదహర్బ్రహ్మ ప్రతిపద్యతే' అంటున్నది. అంటే, బ్రహ్మసాక్షాత్కారం కలిగిన ఋషినే బ్రహ్మస్వరూపునిగా అధ్యారోపించట మన్నమాట. మొదటి ఆరణ్యకంలో సూచ్యార్థసూచనగా ప్రసక్తమైన ఈ బ్రహ్మాత్మభావాన్ని ఐతరేయోపనిషత్తు చక్కగా వివరించింది.

ఐతరేయారణ్యకంలోని ద్వితీయ, తృతీయారణ్యకాల పూర్వపాఠానికి 'మహా ఐతరేయో పనిషత్తు' అని వ్యవహారం ఏర్పడింది. తృతీయారణ్యకానికి ప్రత్యేకంగా 'సంహితోపనిషత్తు' అనే పేరుకూడా ఉన్నది. ఉపనిషద్బ్రహ్మయోగి వంటివారు ద్వితీయారణ్యకాన్ని మాత్రమే గ్రహించి ఐతరేయోపనిషత్తుగా వ్యాఖ్యానించారు. అయితే, శ్రీమదాదిశంకరాచార్యులవారు ఈ ద్వితీయా రణ్యకంలోని చివరి ఆరు అధ్యాయాలను (ఆత్మస్వరూపాన్ని తెలియజెప్పే ఈ భాగాన్ని 'ఆత్మషట్కము' అనికూడా అంటారు) సంకలించి ఐతరేయోపనిషత్త్వాతంగా నిర్ణయించారు. ద్వితీయారణ్యకంలో ఈ ఆత్మషట్కానికి పూర్వం ఉన్న అధ్యాయాలలో ప్రాణము లేదా హిరణ్యగర్భుడు విశ్వానికి ప్రథమకారణమని బోధింపబడింది. ప్రాణవిద్యకు సంబంధించిన కర్మకలాపం, ధ్యానపద్ధతులు సమగ్రంగా వివరింపబడ్డాయి. అతిగభీర వేదాంతభావనకు ప్రాకరస్థానమైన ఈ భాగాన్ని గురించి నైపథ్యానుశీలనగా రెండు మాటలు:

ఐతరేయ ద్వితీయారణ్యకం 'ఏష పన్థా ఏత త్కర్మైత ద్బ్రహ్మైత త్సత్యం, తస్మాన్నప్రమాద్యే త్తన్నాతీయాత్' అన్న ప్రబర్హ శబ్దాతిరేకంతో ప్రారంభమవుతున్నది. అమృతత్వసాధనకు, మహానందలబ్ధికి ఆత్మజ్ఞాన మొక్కటే ఉపాయం. అందుకు వేదోక్తవిధులను నిష్కామబుద్ధితో ఆచరించి, ఫలాన్ని బ్రహ్మార్పితం చేయాలి. ఇదే శ్రుతిప్రతిపాదితమైన పరమధర్మం. అందువల్ల సాధకులు ఆత్మజ్ఞానవిషయాన్ని, తత్సాధనసామగ్రిని ఎన్నడూ ఉపేక్షింపకూడదు. ఆ రోజుల్లో పెద్దలెవరూ ఈ సదుపదేశాన్ని పెడచెవిని పెట్టేవారు కారు. కాదని



తప్పటడుగు వేసినవారికి పరాభవమూ తప్పింది కాదు. 'న హ్యాత్యాయత్పూర్వే యేఽ త్యాయ న్తే పరాబభూవుః' అన్న ప్రతిషేధవాక్యం అందుకే పుట్టింది. సకర్మకమైన వేదమతాన్ని పాటించే స్వర్గాపవర్గ సిసాధయిషువుల దృష్టిలో 'ఉక్థ' శబ్దానికి మహావ్రతాచరణవేళ సుప్రధానంగా ఉపచరించే శస్త్రము లేదా గద్యరూపంలో రచితమైన స్తోత్రవిశేషము అన్న సామాన్యార్థం అనుమోదితమై ఉండవచ్చును గాని ఐతరేయానుసారం దీనికి 1. విశ్వము, 2. జీవుడు, 3. భూతజాతము, 4. ఆత్మ, 5. అన్నము, 6. అన్నాదుడు మొదలైన గూఢార్థాలున్నాయి. వేదోక్తమైన కర్మకాండను ఆచరిస్తూ ధ్యానధారణ మొదలుపెట్టినవారికి 'అహమ్ ఉక్థమస్మి' అనే వాక్యార్థం గోచరిస్తుంది. ఏతత్ఫలంగా ప్రజాపతి నామంతో ఉపలక్షితుడైన పురుషుడే నిఖిలజగత్కారభూతుడైన హిరణ్మయపురుషుడని బోధపడుతుంది. ఆ విరాట్ పురుషతత్త్వమందే బ్రహ్మము సాక్షిమాత్రుడై వ్యవహరిస్తుంటాడు. 'త దిదం కర్మ కృత మయం పురుషో బ్రహ్మణో లోకః' అన్నది నిగమనం. ఈ ఉక్థమే చేతనాచేతనాత్మకమైన శక్తివిశేషం. ఈ ఉక్థమే బ్రహ్మము. ఇదే ప్రాణశక్తి. ఈ బ్రహ్మము లేదా చైతన్యము పాదాగ్రాలనుంచి శరీరంలోనికి ప్రవేశించి ఊర్ధ్వముఖంగా ఊరువులు ఉదరము హృదయము శిరస్సులకు వ్యాపించి, దర్శనం (చూపు) శ్రవణం (వినికిడి) బుద్ధి (ఆలోచన) వాక్కు (పలుకు) ఉచ్ఛ్వాస నిఃశ్వాసలుగా పరిణమిస్తుంది. అందువల్లనే యోగులలో కొందరు బ్రహ్మమును ఉదరభాగమందు, కొందరు హృదయభాగమందు ధ్యానించటం ఉన్నది. 'ఉదరం బ్రహ్మేతి శార్కరాక్ష్యా ఉపాసతే, హృదయం బ్రహ్మ త్యారుణయః' ఇత్యాది ప్రమాణంవల్ల ఉదరమందు బ్రహ్మమును ధ్యానించేవారు శార్కరాక్ష్యులని, హృదయసద్మంలో నిలుపుకొని ధ్యానించేవారు ఆరుణులని గ్రహించాలి. వీరిలో శార్కరాక్ష్యులు ఆ బ్రహ్మమును వైశ్వానరుడనే ప్రజ్ఞగా అవధరిస్తారనికూడా చెప్పబడింది. బృహదారణ్యకం, ఛాందోగ్యం, కౌషీతకి, ప్రశ్న మొదలైన ఉపనిషత్తులలో ప్రాణేంద్రియాలకు ఆధిక్యసంపాదనార్థమై జరిగే పరస్పరకలహం చిత్రింప బడింది.

బృహదారణ్యకం :

> అథ రూపాణాం చక్షు రిత్యేత దేషాముక్థ మతో హి సర్వాణి రూపాణ్యుత్తిష్ఠ న్త్యేతదేషాగ్ సామైతద్ధి సర్వై రూపై స్సమమేత దేషాం బ్రహ్మైతద్ధి సర్వాణి రూపాణి బిభర్తి. అథ కర్మణా మాత్మే త్యేత దేషా ముక్థ మతోహి సర్వాణి కర్మాణ్యుత్తిష్ఠన్త్యేతదేషాగ్ సామైతద్ధి సర్వైః కర్మభిః సమమేతదేషాం బ్రహ్మైతద్ధి సర్వాణి కర్మాణి బిభర్తి తదేత త్త్రయం సదేక మయ మాత్మాత్మో ఏకస్సన్నేతత్త్రయం తదేతదమృతగ్ సత్యేనచ్ఛన్నం ప్రాణో వా అమృతం నామ రూపే సత్యం తాభ్యా మయం ప్రాణ శ్ఛన్నః. (6-2 3)

ఛాందోగ్యం :

> యోహ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద జ్యేష్ఠశ్చ హ వై శ్రేష్ఠశ్చ భవతి ప్రాణో వావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ. (6 1)



కౌషీతకి :

అథాతో దైవః పరిమర ఏతద్వై బ్రహ్మ దీప్యతే యదగ్ని ర్జ్వలత్యథైతన్మ్రియతే య న్నజ్వలతి తస్యాదిత్యమేవ తేజో గచ్ఛతి వాయుం ప్రాణ ఏతద్వై బ్రహ్మ దీప్యతే యచ్చన్ద్రమా దృశ్యతే యద్విద్యుద్విద్యోతతేఽ థైత న్మ్రియతే య న్న విద్యోతతే తస్య విద్యుతమేవ వాయుమేవ ప్రవిశ్య వాయౌ తృప్తా న మూర్ఛన్తే తస్మాదేవ పునరుదీరత ఇ త్యధిదైవత మథాధ్యాత్మమ్.

అథాతో నిఃశ్రేయసా దానం సర్వాహ వై దేవతాఽహం శ్రేయసే వివదమానా అస్మా చ్ఛరీరా దుచ్చక్రము స్తద్దారుభూతం శిష్య అథ హైనం వాక్ప్రవివేశ తద్వాచాఽవద చ్ఛిష్య ఏవాథ హైనం చక్షుః ప్రవివేశ తద్వాచా వద చ్చక్షుషా పశ్యచ్ఛిష్య ఏవాథహైనం శ్రోత్రం ప్రవివేశ తద్వాచావదా చ్చక్షుషా పశ్యచ్ఛ్రోత్రేణ శృణ్వన్మనసా ధ్యాయచ్ఛిష్య ఏ వాథ హైనతాప్రాణః ప్రవివేశ తత్తత ఏవ సముత్తస్థౌ తద్దేవాః ప్రాణే నిశ్రేయసం విచిన్త్య ప్రాణమేవ ప్రజ్ఞాత్మాన మభిసంస్తూయ సహైతై స్సర్వై రస్మా చ్ఛరీరా దుత్క్రమతి స వాయు ప్రతిష్ఠాకాశాత్మా న స్సర్వేతి తద్భవతి యత్రైతద్దేవా స్తత్ప్రాప్య తదమృతో భవతి యదమృతా దేవాః. (4 3)

అని. ఈ నిదేశాలన్నింటిలోనూ పార్యంతికంగా ప్రాణశక్తికే శ్రేష్ఠత్వం నిరూపితమై ఉన్నది. 'త్వముక్థమసి త్వమిదం సర్వమసి తవ వయంస్మః త్వమస్మాకమసి - త్వమస్మాకం తవస్మసి (ఋగ్వేదం 8-92-32)'. 'నీవే ఉక్థమవు, నీవే సమస్తానివి, నీవు మా దానవు, మేము నీ వారము' అని వేదం అంటున్నది.

ఆ తర్వాత అధ్యాయంలో ఉక్థ సంజ్ఞితమైన ప్రాణమే 1. దినము, 2. ఉదయ సాయాహ్నాలు, 3. సత్స్వరూపము - అని ప్రతిపాదింపబడింది. ప్రాణము లేదా చేతనా చేతనాత్మకమైన జీవశక్తియే సమస్త వాగ్వ్యవహారానికి మూలకందమని, వాక్కే విశ్వవిజ్ఞానానికి ఆధారమని ఈ అధ్యాయం నిరూపిస్తున్నది. 'తస్య వా క్తన్తిర్నామాని దామాని తస్యేదం వాచా తన్త్యా నామభి ర్దామభి స్సర్వం హీదం నామనీ సర్వం వాచాభిదదతి' అనే సూక్తాభిప్రాయమూ ఇదే. అందువల్ల ప్రాణమే జ్ఞానమూలకమైన వేదానికీ ఆధారమని చెప్పవచ్చును. ఈ ప్రాణమే సచ్చిదానందస్వరూపమైన పరబ్రహ్మానికి ఉపలక్షకం. ఈ ప్రాణమే విశ్వాన్తరితమైన ఆత్మతేజం. ప్రాతిభాసికమైన ఈ జగత్తు వ్యక్తరూపాన్ని పొందకమునుపు నిర్గుణ బ్రహ్మమునందు వాగ్రూపంలో (అనగా భావనారూపంలో) నిక్షిప్తమై ఉన్నది. ఈ ప్రాణశక్తి పర్యావర్తింపని చోటుండదు. ఈ ప్రాణశక్తే ప్రాతిభాసికజగత్తును బృహతీరూపంలో సంరక్షిస్తున్నది. ఈ విధంగా ప్రాతిభాసికమైన లేదా పరిదృశ్యమానమైన జగత్తు అనటంవల్ల పిపీలికాది బ్రహ్మపర్యంతమైన సమస్తమూ ప్రాణమయమేనని తాత్పర్యం. 'సర్వం హీదం ప్రాణేనాకృతం; సోఽయ మాకాశః ప్రాణేన బృహత్యా విష్టబ్ధ స్తద్యథాఽయ మాకాశః ప్రాణేన బృహత్యా విష్టభానీత్యేవం విద్యాత్' అని ఆరణ్యకం. షట్త్రింశద్వర్ణ వర్ణితమైన బృహతీ (నవమ) చ్ఛందానికి ( పాదానికి 9 వర్ణాల లెక్కన



9 x 4  36) లక్షణశాస్త్రంలో విశిష్టమైన స్థానం ఉన్నది. బృహతి అంటే అత్యంత విస్తారితమనే అర్థంకూడా ఉన్నది. అందుచేత బృహతిగా అభివ్యంజితమైన ప్రాణము చరాచరాత్మక జగద్విస్తార సుస్థితికి మూలకందమని ప్రశంసింపబడింది.

ఆరవ అధ్యాయంలో పురుష శక్తుల సమ్యగభివర్ణనం ఉన్నది. ప్రాణము బ్రహ్మాండము యొక్క జీవశక్తి కాగా పురుషుడు ఆ బ్రహ్మాండమందలి జీవవ్యక్తి అని చెప్పాలి. ప్రాణ విరాట్పురుషతత్త్వాలకు అభేదాధ్యవసాయం. అందువల్ల ఈ రెండింటికీ ప్రకృతాధికరణంలో పర్యాయవాచిత్వం కనబడుతుంది. కొడుకులు తండ్రిని, సేవకులు యజమానిని సేవించినట్లు ఇంద్రియాలు ప్రాణశక్తిని సేవిస్తుంటాయి. ఈ వర్ణనలన్నీ సత్యస్వరూపుడైన బ్రహ్మమును, విరాట్పురుషతత్త్వాన్ని ఆరాధించే సాధకుల ధ్యానధారణ కోసం ఉద్దేశింపబడినవి. ప్రాణమును పురుషునిగా నిరూపించినందువల్ల, సాధకులు మరింత ఏకాగ్రతను సాధించటానికి వీలుగా ఆ పురుషుని రూప నామ వైభవాలను, విభూతులను, ప్రసాధనసామగ్రిని వర్ణించటం జరిగింది.

ఆ విధంగా పురుషుడు జ్ఞాన కర్మములను ఊతగాగొని సృష్టిక్రియను మొదలుపెట్టి తొలుత జలములను సృజించాడు. ఆ జలములనుండి సమస్త చరాచర జగత్తు ఆవిర్భవించింది. ఈ సత్యాన్ని దృష్టిలో ఉంచుకొనే, వేదకవులు పురుషుని తండ్రితో సరిపోల్చి భూతాదులను కొడుకులుగా నిరూపించారు. 'తదిద మాప ఏవ; ఇదం వై మూలమ్; అదస్తూలమ్, అయం పితా ఏతే పుత్త్రాః, యత్ర హ క్వచ పుత్త్రస్య తత్పితుః యత్ర వా పితుః తద్వా పుత్త్రస్య' అన్న మాటల అంతరార్థం ఇదే. మహిదాస ఐతరేయుడు ఈ పితృసుతాది భావపరమార్థాన్ని చక్కగా గ్రహించినవాడు కనుకనే, 'నేను నానుండి దేవతలుగా బాహుళ్యాన్ని చెంది ఆ దేవతలు నేనుగా ఏకత్వాన్ని భజిస్తున్నారని ఎరుగుదును' అనగలిగాడు. భేదభావనలన్నీ వ్యవహారార్థమే కాని వాస్తవికాలు కావని ఇక్కడ ప్రతిపాదింపబడుతున్నది. దీని ప్రకారం సర్వాత్మకములైన జలములు లేదా ప్రజాపతి లేదా పురుషుడు ప్రాణమునకే పర్యాయాలని, సర్వమూ ప్రాణమేనని తేలింది. ఆతడే జలములందు ఉన్నవాడు - జలశాయి. ఆతడే ప్రాణము. ఆతడే సదసదాత్మకుడు. దేవతలు ఆతనిని సత్స్వరూపునిగా ఆరాధించి మహామహిమోపేతులయ్యారు. దానవులు వైరభక్తితో ఆయనను అసత్స్వరూపునిగా విరోధించి పరాజయాన్ని పొందారు. మృత్యువు, అమృతత్వము - రెండూ ఆయనే. 'స ఏషోఽ ప్సు స ఏష ప్రాణః స ఏష భూతిశ్చాభూతిశ్చ, తం భూతిరితి దేవా ఉపాసాఞ్చకిరే, తే బభూవుః ..... అభూతి రి త్యసురాః తే హ పరాబభూవుః ....... స ఏష మృత్యుశ్చైవామృతం చ' - అని మూలం. అమృతమయమైన ప్రాణము, మరణశీలుడైన జీవుడు అన్నమునందు సహవాసం చేస్తున్నారు. నశ్వరమైన ఈ చరాచర సమస్తజీవకోటియందు ఈశ్వరుడు ప్రాణరూపుడై అధిష్ఠించి ఉంటాడు. ఆ అధిష్ఠాతకు మృత్యువు లేదు. 'అమర్త్యో మర్త్యేనా సయోనిః ఇతి, ఏతేన హీదం సర్వం సయోనిః మర్త్యాని హీమాని శరీరాణీ అమృతైషా దేవతా; తా శశ్వన్తా విషూచీనా వియన్తా ని అన్యం చిక్యుః న నిచిక్యు రన్య మితి నిచిన్వన్తి హైవేమాని శరీరాణీ అమృతైషా దేవతా' - అంటే అమర్త్యమైన ప్రాణము, మర్త్యమైన దేహము రెండూ రెండు భిన్నమార్గాలలో ప్రయాణిస్తాయి. రెండూ కలిసి ఉన్నట్లే ఉండి విడిపోతాయన్నమాట. ఈ రెండింటి సంయోగం వలన ఒకటి పెంపొంది మరొకటి తరిగిపోతుంది.



దేహం పెరిగిన కొద్దీ ప్రాణము క్షీణించిపోతుందని తాత్పర్యం. దేహానికే తప్ప ఈ వినాశనాది ధర్మాలు ప్రాణానికి, అధిష్ఠాతకు వర్తించవు.

ఈ విధంగా ప్రాణముయొక్క మాహాత్మ్యాన్ని వర్ణిస్తూ సాంప్రతాధ్యాయంలో సూర్యునితో ప్రాణానికి అభేదం చెప్పబడింది. 'ఏష ఇమం లోక మభ్యార్చత్ ప్రాణో హ్యేష య ఏష తపతి' - అన్నచోట సూర్యుడు లోకం లోనికి పురుషరూపుడై ప్రవేశిస్తాడని, ఆతడే ప్రాణమని నిగమనం ఉన్నది. ఈ ప్రాణమే శతర్చింసుడు, మధ్యమసుడు, గృత్సమదుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, అత్రి, భారద్వాజుడు, వశిష్ఠుడు అనే పేర్లతో ఎనిమిదిమంది వేదర్షులుగా పరిఢవిల్లినదట. మూర్తామూర్తసమస్తమూ ఈ ప్రాణమే ("సైదం సర్వమ్"); ప్రగాథలు, పావమానులు, క్షుద్రసూక్తాలు, మహాసూక్తాలు, సూక్తాలు, ఋక్కులు, ఋగర్థాలు, పాదము, వర్ణము అన్నీ ఈ ప్రాణమే. 'సర్వ ఋచః సర్వే దేవాః సర్వే ఘోషాః ఏకైవ వ్యాహృతిః, ప్రాణ ఏవ ప్రాణ ఋచ ఇత్యేవ విద్యాత్' - స్థావర జంగమాత్మక జగద్విస్తారమంతటా ప్రాణమే ఆతతమై ఊతగా ఉన్నది. సాధకులు సర్వఋక్కులకు (ఋగాది మంత్రవిశేషాలకు), సర్వ దేవతానీకానికి, సర్వశబ్దాలకు ప్రాణమొక్కటే వ్యాహారమని గ్రహించాలి. ఇక్కడే ఒక రమ్యమైన కథానకం: విశ్వామిత్ర మహర్షి ఇంద్రుని వద్దకు వెళ్ళి వేదగానం చేస్తాడు. 'తమిన్ద్ర ఉవాచ ఋషే ప్రియం వై మే ధామోపాగా వరం తే దదామీతి' ఆ పాతసౌష్ఠవానికి పులకితుడై ఇంద్రుడు ఆయనను వరం కోరుకొమ్మంటాడు. 'సహోవాచ త్వామేవ విజానీయా మితి' - విశ్వామిత్రుడు 'అయ్యా! నీవెవరవో తెలియజెయ్యి' అని అడుగుతాడు. 'తమిన్ద్ర ఉవాచ, ప్రాణో వా అహమస్మ్యృషే ప్రాణ స్త్వం ప్రాణః సర్వాణి భూతాని; ప్రాణో హ్యేష య ఏష తపతి; స ఏతేన రూపేణ సర్వా దిశో విష్టోఽస్మి' ఆ మాటకు "నేను ప్రాణమను; నీవూ ప్రాణానివే. సర్వభూతాలూ ప్రాణమే. వెలుగునూ వేడిమినీ విరజిమ్మేవాడు ప్రాణం. ప్రాణరూపాననే నేను సర్వదిశలలో అభివ్యాపించి ఉన్నాను. వెలుగును, వెలుగొందేవాడను నేను' అని గర్భితార్థప్రకాశనగా ఇంద్రుడంటాడు. ఈ ప్రాణమే మహావ్రతానుష్ఠానంలో పఠించే నిష్కైవల్యశాస్త్రమనే శ్లోకసాహస్రిగా వ్యక్తమైనదని ఆ తరువాతి అధ్యాయంలో వస్తుంది. ఈ శ్లోకాలన్నీ బృహతీచ్ఛందంలో ఉండటం ఇక్కడి విశేషం. బృహతిలో పాదానికి తొమ్మిది అక్షరాలు, శ్లోకానికి 36 అక్షరాలు. మానవజీవితం శతమానం కనుక ఈ శ్లోకసాహస్రిలోని 36,000 అక్షరాలూ - రాత్రులు వ్యంజనాలుగా, పగళ్లు స్వరాలుగా సంకేతింపబడిన నూరు సంవత్సరాలతో (ముప్పైఆరువేల రోజులతో) సంవదిస్తున్నాయని తాత్పర్యం. ఈ సాహస్రికసంఖ్యకు ఇంకా అనేక విశేషార్థాలున్నాయి. అత్యధికసంఖ్య లేదా సర్వాంతర్వర్తనీయ (all-inclusive) సంఖ్య అనే అర్థం ఉన్నది. అందువల్లనే ఈ ఆరణ్యకమంతటా శుద్ధసత్త్వస్వరూపమైన ప్రాణానికి బృహతీసంజ్ఞతో పర్యాయవాచిత్వం నెలకొల్పబడింది. ఉపనిషత్తులు ప్రతిపాదించిన పరమసత్యానికి ప్రాగ్భూమికగా ఈ అధ్యాయం 'ప్రాణాతీతుడై బృహతీసహస్రాత్మకుడైన పురుషుడే ప్రజ్ఞామయుడు, దేవతామయుడు; ఈ అభిజ్ఞానం కలవాడు బ్రహ్మమయుడై బ్రహ్మమే అవుతాడు' అంటున్నది. 'సోఽహం' వాక్యార్థమూ ఇదే. అహం (నేనే) సః (ఆతడు), సః (ఆతడే) అహం (నేను) అని. ఇదే భావంతో చరాచరాలన్నింటికీ ఆత్మ సూర్యుడే 'తస్య వా ఏతస్య బృహతీసహస్రస్య పరస్తాత్ప్రజ్ఞామయో



దేవతామయో బ్రహ్మమయో అమృతమయః సంభూయ దేవతా అప్యేతి య ఏవం వేద. తదుక్త మృషిణా సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ' అని ఋగ్వేదం (1.115.1) అంటున్నది.

ద్వితీయారణ్యకంలోని మూడవ అధ్యాయమంతా ఉక్థ (స్తోత్రవిశేష) రూపమైన ఆత్మము యొక్క ప్రస్తావనే. పంచీకృతమైన ఉక్థము (– ప్రాణము) నుండి సమస్తవిశ్వమూ ఆవిర్భవించి అన్న (ద్రవ్యము) అన్నాద (ఆత్మ) శక్తిసమన్వయం వల్ల స్థితిమంతమై ఉన్నది. ప్రారంభంలో ఆత్మ అంటే దేహమనే అనిపిస్తుంది గాని క్రమక్రమంగా వాస్తవార్థం అనుభూతమై ఆత్మతత్త్వం బోధపడుతుంది. కేవలానుభవానందస్వరూపమైన ఈ తత్త్వాన్ని ఎంత అందంగా వివరించారో చూడండి: 'తస్య య ఆత్మాన మావిస్తరాం వేదాశ్నుతే హ ఆవిర్భూయ; య ఓషధివనస్పతయో యచ్చ కిఞ్చ ప్రాణభృ త్స ఆత్మాన మావిస్తరాం వేద; ఓషధి వనస్పతిషు హి రసో దృశ్యతే, చిత్తం ప్రాణభృత్సు; ప్రాణభృత్సు త్వేవావిస్తరా మాత్మా; తేషు హి రసోఽపి దృశ్యతే న చిత్త మితరేషు. పురుషే స్త్వేవా విస్తరా మాత్మా, స హి ప్రజ్ఞానేన సమ్పన్నమ్, అతో విజ్ఞానం వదతి విజ్ఞానం పశ్యతి వేద శ్వస్తనం వేద లోకాలోకౌ మర్త్యేనామృత మీప్సత్యేవం సమ్పన్నః. అథేతరేషాం పశూనా మశనాపిపాసే ఏవాభిజ్ఞానం న విజ్ఞాతం వదన్తి న విజ్ఞాతం పశ్యన్తి న విదుః శ్వస్తనం న లోకాలోకౌ త ఏతావన్తో భవన్తి యథా ప్రజ్ఞం హి సంభవాః' - అని. ఆత్మయొక్క స్వరూపావగాహన కలిగేకొద్దీ వ్యక్తికి తానంటే ఏమిటో మరింత స్పష్టంగా తెలిసివస్తుంటుంది. ఇది పుస్తకాలలోని శబ్దాలతో కలిగే పరిచయం వంటిదికాదు. స్వానుభవంలో గోచరించే సత్యం. తానంటే ఏమిటో తెలిసివచ్చినకొద్దీ ఈ అవగాహన విస్తృతమవుతుంది. తనతోపాటు తనచుట్టూ ఉన్న ఓషధీవనస్పతులు, జంతుజాలం, సమస్తం ఆత్మస్వరూపాలేనని తెలుస్తుంది. సామాన్యదృష్టికి చెట్లూచేమల్లో రసతత్త్వం, జంతువులలో చైతన్యం సులభంగానే కనుపిస్తాయి. వృక్షాదులలో జీవం ఉన్నదని మాత్రమేతప్ప అంతకంటె అర్థంకాదు. జంతువులలో జీవంతోపాటు ఆలోచనాశక్తికూడా ఉన్నదని ఆకళింపవుతుంది. మానవుల విషయం అంతకంటె తేలిక. ఏమంటే మానవులకు జీవమూ, ఆలోచనాశక్తి - ఈ అన్నింటినీ మించిన బుద్ధిమత్త ఉన్నాయి. అతనికి చూసినదానిని గ్రహించటమే కాదు, గ్రహణధారణతో దానిని వివరించి చెప్పగలిగే శక్తికూడా ఉన్నది. భూతవర్తమానాలతోపాటు అతనికి భావిస్ఫురణా ఉన్నది. తన పరిసరాలలోనూ, తనకు సుదూరంలోనూ లోకాలోకాలలో ఏమున్నదో అతనికి తెలుసు. ఆ తెలియటంవల్లనే ఏది శాశ్వతమో, ఏది అశాశ్వతమో వివేకించే శక్తి అలవడింది. నశ్వరసాధనాలతో అనశ్వరమైనదానిని సాధింపగోరుతున్నాడు. ఈ లక్షణాలలో ఏ ఒక్కటీ జంతువులకు సాధ్యంకాదు. మానవుడే మహనీయుడని, మహోన్నతస్థితిని చూరగొనటానికి ఉత్తమాధికారి అనీ ఇక్కడ వివక్షితార్థం. సమస్త జీవరాశికీ మానవుడే శ్రేష్ఠుడన్న ఈ వివరణ ఐతరేయారణ్యకం వలన ప్రభావితమైన అనంతరీయకృతులలోనూ కనుపిస్తుంది. మనుస్మృతి, మహాభారతం, శ్రీమద్భాగవతం వంటి గ్రంథాలు దీనిని నానాఖ్యానమనోహరంగా విశదీకరించాయి. మానవుని ప్రతిభాశ్రీవిలసనానికి, జగన్మంగళాస్పదభావసంపదకు అంతులేదు. పూనుకొంటే అతనికి అసాధ్యమైనది లేదు. అందువల్ల అనంతరాధ్యాయంలో మనిషిని మహాసముద్రంతో సరిపోల్చారు. అతను సర్వోన్నతుడని తేల్చారు. అతను సాధింపలేని వస్తువు లేదు. అంతేకాదు, సాధించినంతటితో



అతని మనస్సు ఊరుకోదు. అంతకంటె పైదానికోసం ఉరకలు వేస్తుంది. అంతరిక్షాన్ని అందుకొన్నా, అంతకంటె పైకి వెళ్లాలని అతని ఉత్సాహం. ఆ తర్వాతో? అంతకు మించినది, అంతకంటె అతీతమైనదీ కావాలి. 'స ఏష పురుషః సముద్రః, సర్వం లోక మతియత్ హ కిఞ్చ అశ్నుతే అత్యేనం మన్యతే యది అన్తరిక్షలోకం అశ్నుతే అత్యేనం మన్యతే య ద్యముం లోకం అశ్నువీతే అత్యేవైనం మన్యతే'. ఈ దూర - దవిష్ఠాలను సమీపించాలనే కోరిక ఆద్యంతాల గుర్తులులేని అనంతంలోకి అడుగుపెట్టేవరకు అతనిని ముందుకు నడిపిస్తూనే ఉంటుంది. సర్వాతీతమైన ఆ శుద్ధ బుద్ధ ముక్త కేవల అఖండ సచ్చిదానంద స్థితిలోగాని అతని యాత్రకు ముగింపు లేదు.

ఇక ద్వితీయారణ్యకంలో మిగిలిన భాగమంతా జనులలో మహావ్రతాన్ని అనుష్ఠించాలనే సంకల్పాన్ని కలిగించేందుకు ఉద్దేశింపబడింది. ఈ యాగక్రియకు పరికరించే బృహతీచ్ఛందం ఆత్మ అని, తక్కినవన్నీ దేహ తదంశమాత్రాలని ప్రశంసింపబడింది: "ఏష వై కృత్స్న ఆత్మా య ద్బృహతీ; సోఽయ మాత్మా సర్వతః శరీరైః పరివృతః తద్యథాయ మాత్మా సర్వతః శరీరైః పరివృత ఏవమేవ బృహతీ సర్వతః ఛందోభిః పరివృతా; మధ్యం హ్యేషా మజ్జానా మాత్మా మధ్యం ఛన్దసాం బృహతీ". మహదుక్థాన్ని సుస్వరంగా పఠించడమే వాక్పరమావస్థ 'స వా ఏష వాచః పరమో వికారో యదేత న్మహదుక్థమ్'. మాటకు ప్రాణం సత్యమన్న శ్రుతివాక్యం ఇక్కడ సుప్రయుక్తమయింది: 'అథైతన్మూలం వాచో యదనృతం తద్యథా వృక్ష - ఆవిర్మూలః శుష్యతి స ఉద్వ ర్తతే ఏవమేవానృతం వదన్నావిర్మూల మాత్మానం కరోతి స శుష్యతి స ఉద్వ ర్తతే తస్మాదనృతం న వదేత్ దయేత త్వేనేన' అని. వాక్కు అనే వృక్షానికి అనృతం వేరువంటిదని, వేరు బయటపడితే చెట్టు ఎండిపోయినట్టు అసత్యం ఎప్పుడో ఒకప్పుడు బయటపడి వ్యవహర్తను నశింపజేస్తుందని దీని తాత్పర్యం (చూ. ప్రశ్న. 2 7). బృహతీశ్లోకసాహస్రిగా నిరూపితమైన ప్రాణమే యశస్సని, అదే ఇంద్రుడని, చరాచరాల సృష్టికర్త అని నిశ్చయించడంతో ఈ అధ్యాయం ముగుస్తున్నది. నిర్గుణమైన పరబ్రహ్మమునుండి సగుణమైన సృష్టి ఏర్పడినదని మహిదాస ఐతరేయుడు ఈ అధ్యాయంలో నిరూపించాడు. ప్రాణమే జీవేశ్వరుడైన ఇంద్రుడన్న ఎరుకగలవాడే జగద్బంధనాలనుంచి ముక్తుడు కాగలడని ఆయన నొక్కి చెప్పాడు. అధ్యాయాంతంలో తన వక్తవ్యాన్ని మళ్లీ ఒకసారి ముక్తసరిగా కొన్ని శ్లోకాలలో పేర్కొన్నాడు: శుక్రశోణితాలు సూర్యాగ్నుల వలె ఏకమై పాంచభౌతికమైన దేహం ఏర్పడుతున్నది. దేహమే ఆత్మ కాదన్నంత మాత్రాన దేహాన్ని తుచ్ఛమని అసహ్యించుకోవటం తగదు. ఏమంటే, నిత్యమే అయినప్పటికీ ఉపాధి లేనిదే ప్రాణానికి ద్యోతకత్వం ఉండదు. ఇంద్రియాలనే సాలంకృతహయాలు ముందువెనుకలకు పట్టి లాగుతున్న ప్రాణానికి మనికిపట్టు దేహమే. ప్రాణానికి ప్రాణమైన బ్రహ్మానికి ఆకరం అదే; సమస్త దేవతా నికరానికీ నివేశస్థానం అదే. 'యదక్షరం పఞ్చవిధం సమేతి యుజోయుక్తా అభి య త్సంవహన్తి. సత్యస్య సత్యమను యత్ర యుజ్యతే తత్ర దేవా స్సర్వ ఏకం భవన్తి'. మనోవాక్కులకు, తర్కవితర్కాలకు అందని పరమసత్యాన్ని మన ప్రాచీనులు ఏనాడో గ్రహించారు. ఆ మహర్షుల మార్గంలో నడిచి మనమూ ఆ మహోన్నతసత్యాన్ని గుర్తింపగలగాలి. ఏకమూ, అద్వితీయమూ అయిన పరవస్తువుకు స్త్రీపురుషాది సంజ్ఞలు, ఆ మాటకువస్తే అసలు రూపనామాదులే ఉండవు. శబ్దము దానిని వ్యంజనచేత సూచ్యార్థసూచనగా మాత్రమే చెప్పగలదు.



అట్టి శబ్దవృత్తిని ఆశ్రయించి మహర్షులు దానిని 'అః' అని సంకేతించారు  అని ఈ విధంగా ఏకుడై సర్వవ్యాపకుడై సర్వసర్వాత్మకుడైన ప్రభువును ప్రాణముగా అభివర్ణించిన తర్వాత ఆ సర్వేశ్వరుని తపస్సుచేత, యజ్ఞం మూలాన ఆరాధించే విధానం సాంగోపాంగంగా వివరింపబడింది. ఈ ద్వితీయారణ్యకంలో నాలుగవ అధ్యాయం మొదలుకొని ఆరవ అధ్యాయం వరకు ఉన్న భాగమే ఐతరేయోపనిషద్గ్రంథానికి మూలం.

తృతీయారణ్యకానికి సంహితోపనిషత్తు అని పేరు. ఇది తైత్తిరీయోపనిషత్తు ప్రథమాధ్యాయంలోని కొంతభాగానికి సరిపోలినది. అయితే సంహితను ధ్యానమార్గానికి మలచటంలో రెండింటికీగల ఆంతరతమ్యం పరిమితప్రాయమేగాని ఎక్కువకాదు. మాండూకేయ ముని సాధకులు ధ్యానానికి ఉపక్రమించినప్పుడు పృథ్విని ప్రాథమికరూపంగా, స్వర్గమును ఉత్తరావధిగా, వాయువును సంయోజకంగా గ్రహించాలని సూత్రీకరింపగా; ప్రామాణికుడైన మరొక ఋషి మాక్షవ్యుడు  వాయ్వాకాశములలో వాయువుకంటె ఆకాశానికే సంయోజకత్వం ఉచితమని భావించినట్లు; అగస్త్యుడు వాయ్వాకాశ లక్షణవిషయమై మాక్షవ్యునితో విభేదించి అవి రెండూ ధర్మసామ్యం కలిగినవని అన్నట్లు  ఇక్కడ ప్రస్తావింపబడింది. ఇదంతా బ్రహ్మాండశక్తులను ధ్యానించే విధానానికి ఉపక్రమణిక.

ఆ తర్వాత సంహితను గురించి శాకల్యుని బోధనవిషయం మనము తెలుసుకొంటాము. ఆయన చెప్పినదానినిబట్టి పృథ్విది ప్రాథమికరూపం. స్వర్గానిది పరమావధి. వర్షం సంయోజనం, మేఘం సంయోజకం. అండకోశంవలె పురుషునియందు అంశద్వయం ఉన్నదని ఆయన బోధించాడు. భూమ్యాకాశాలకు నడుమ వాయువు ఉన్నట్లు ఊర్ధ్వాధస్సులకు మధ్యావకాశంలో ప్రాణం ఉన్నదని భావించాలి. వ్యక్తిచైతన్యం బ్రహ్మాండచైతన్యానికి ఉపలక్షణమని ప్రతిపాదించి ఆయన ఆకాశమధ్యగతుడైన సూర్యుడు శిరస్సునందలి నేత్రమని, ద్యుమండలంలోని విద్యుత్తు హృదయస్థానమందలి మనస్సని, భూమిష్ఠమైన అగ్ని మేఢ్రమందలి బీజమని అభివర్ణించాడు. తైత్తిరీయంలోవలెనే  ఇక్కడా ధ్యానఫలంగా ప్రజావృద్ధి, పశువృద్ధి, సుప్రతిష్ఠ, స్వర్గారోహణ అన్నవి చెప్పబడ్డాయి.

అనంతరాధ్యాయంలో సంహితా బహుళరూపాలైన సంహితాపాఠం, పదపాఠం, క్రమపాఠం మొదలైనవాటిని నిర్భుజము, ప్రతృణ్ణము, ఉభయమన్తరేణ వంటి పారిభాషిక పదాలతో పరిచయం చేశారు. సమాజసభ్యులు బ్రాహ్మణునితో మాంగళికశబ్దాలతో ప్రసంగించాలనే నిర్దేశం ఇక్కడిదే. బ్రాహ్మణుడు అసాధారణంగా సంపద నార్జించినట్లయితే అతనిని మందలించాలట. అయితే అప్పుడుకూడా పరుషవాక్యాలు ప్రయోగింపకూడదని శూర వీర మాండూకేయుడు ప్రబోధించాడు. ఈ మాటలవల్ల  స్వార్థనిర్ముక్తులై సర్వపరిత్యాగం చేసి లోకహితాచరణోద్యములైన బ్రాహ్మణులను ఆనాటి సమాజం ఎంతటి గౌరవాదరాలతో అభిమానించిందో అర్థమవుతుంది.

ఆ తర్వాత ఒక చక్కటి రూపకంతో ప్రాణతత్త్వం విశదీకరింపబడింది. ప్రాణాన్ని ఇంటి నిలువరానికి ముఖ్యాధారమైన అడ్డుదూలంతో సరిపోల్చారు. నిర్భుజపాఠంలో పూర్వోత్తరాక్షర రూపాల నడిమి వ్యవధానానికిగల లక్షణరహస్యం కూడా ప్రస్తావనకు వచ్చింది. ఊనిక



విషయమూ, తదితర విశేషాలూ గమనార్హాలు. హ్రస్వ మాండూకేయుని అభిప్రాయానుసారం 'పూర్వమేవాక్షరం పూర్వరూపం; ఉత్తర ముత్తరరూపం; యోఽవకాశః పూర్వరూపోత్తరస్యే అన్తరేణ యేన సన్ధిం వివర్తయతి యేన స్వరా స్వరం విజానాతి, యేన మాత్రా మాత్రాం విభజతే, సా సంహితా (3.1.5.)' - ఎక్కడ స్వతః రంజింపజేసే అక్షరం, అంటే స్వరం ఉన్నదో, ఎక్కడ స్వరాన్ని పట్టి నిలిపే మాత్ర ఉన్నదో, పూర్వపరరూపాల సంధి లక్షణం ఏమిటో చక్కగా తెలియాలంటే ఈ సంహితాజ్ఞానం అవసరం. హ్రస్వమాండుకేయునికి ప్రాతిబోధియందు జన్మించిన కొడుకుకూడా మంచి వైయాకరణి అతను, అక్షరాలను మనము ఉచ్చరించేటప్పుడు పూర్వపరస్వరాలు పూర్తిగా సంధిల్లటంగానీ, సంధిల్లకపోవటంగానీ జరుగదని, అందువల్ల పూర్వ పరరూపాల నడిమి మాత్ర సంహితను బోధిస్తున్నదని, దీనికే సామమనే వ్యవహారం ఉన్నదని పేర్కొన్నాడు. దీని స్వరూపజ్ఞానం వల్ల పశుపుత్రైశ్వర్యాది వృద్ధులు కలుగుతాయని ప్రశంసింపబడింది. తార్‌క్ష్యుడు మరొక విధమైన సంహితను నిరూపించాడు. ఆయన ఉపదేశానుసారం బృహత్ రథంతర సామాలు సంధికి కారకాలు. ఇక్కడ బృహత్తు ప్రాణానికి, రథంతరం వాక్కుకు సంకేతాలు. ఈ రహస్యజ్ఞానానికై ఆయన ఏడాదిపాటు గురువుగారింట గోరక్షకునిగా శుశ్రూషలు చేశాడట. కౌంతరవ్యుడు వాక్కు, ప్రాణము, పవమానుడు (వాయువు), సకలదేవతాకోటి, స్వర్గలోకం, బ్రహ్మము పరిణామ క్రమాన్ని అనుసరించి సంహితయా అధిగమ్యమానములని - 'వాక్ ప్రాణేన సంహితా ఇతి కౌంతరవ్యః, ప్రాణః పవమానేన పవమానః విశ్వైర్దేవైః విశ్వే దేవాః స్వర్గేణ లోకేన, స్వర్గో లోకో బ్రహ్మణా, సా ఏషా అవరపరా సంహితా (3.1.6)' అన్నాడు. ఈ సంహిత స్వర్లోకం వరకు అభివ్యాప్తమన్న విషయజ్ఞానం కలవాడు ఆకల్పాంతం దైవతపదాన్ని చూరగొంటాడు. పంచాలచండుడనే ఆచార్యుడు వాక్కే సంహిత అన్నాడు. '...వాచా వై వేదాః సన్ధీయతే, వాచా ఛన్దాంసి, వాచా మిత్రాణి సన్దధతి, వాచా సర్వాణి భూతాని, అథో వాగేవ ఇదం సర్వం ఇతి (3.1.6)'. వాక్కుచేతనే వేదాలు అనుసంధింపబడ్డాయి; ఛందస్సులు కూర్చబడ్డాయి; వాక్కు చేతనే మిత్రులు చేరువవుతున్నారు; వాక్కుచేతనే సర్వులు ఒకరినొకరు అర్థం చేసుకో గలుగుతున్నారు; అందువల్ల ఈ సమస్తమూ వాక్కే - అని. మనము (వేదాన్ని) పఠించేటప్పుడు, మాట్లాడేటప్పుడు ప్రాణము వాక్కులోనికి అవతరించి, ఆ వాక్కు ప్రాణాన్ని ఆహరిస్తున్నది. మనస్సునందు కూడా ఏ శబ్దాత్మకమైన భావనా లేని ప్రశాంతస్థితిలో సయితం, నిద్రావస్థలో సైతం వాక్కు ప్రాణమునందు లయింపక తప్పదు. ప్రాణమే వాక్కును గ్రసిస్తుంది. 'త ద్యత్ర ఏత దధీతే వా భాషతే వా వాచి తదా ప్రాణో భవతి, వాక్ తదా ప్రాణం రేహ్ని. అథ తత్ర తూష్ణీం వా భవతి స్వపితి వా ప్రాణే తదా వాగ్భవతి. ప్రాణః తదా వాచం రేహ్ని; తా వన్యోన్యం రీహ్నః. వాగ్వై మాతా ప్రాణః పుత్త్రః (3.1.6)' అని ఉన్న ఈ భాగానికి ఎంతో గంభీరమైన అర్థం ఉన్నది. ఇందులో తొణికిసలాడుతున్న మనోవైజ్ఞానిక, తాత్త్విక దృష్టికోణాలు పరిశీలింపదగ్గవి. ప్రాణ మనస్సుల అనుబంధం చాలా ప్రగాఢమైనది. యోగశాస్త్రంలో అందుకే మనస్సును అదుపులోనికి తేవటానికి ప్రాణాయామం అభ్యసించమంటారు. ఇవి రెండూ ఎంత సన్నిహితంగా వర్తిస్తాయంటే, ఒకటి నడిచిన దారిలో ఒకటి నడవక తప్పదన్నమాట. వాక్కు యొక్క వివిధదశలైన సూక్ష్మ, పరా, పశ్యంతీ, మధ్యమా,



వైఖరీ భేదాలు మనస్సుయొక్క స్థితిగతులను వివరిస్తున్నవే. అందువల్ల వాటిని మనోభివ్యంజకాలు గానే గుర్తించాలి. తత్త్వతః ప్రాణము, వాక్కు అనేవి సూక్ష్మ (unconscious), వైఖరీ (conscious) అవస్థలుగా చైతన్య శక్తి సంయోజనం వల్ల జ్ఞేయరూపాన్ని పొందుతున్నాయి. అంతేకాదు. మనస్సు ఏకాగ్రమైనప్పుడు ప్రాణముకూడా మనోవృత్తికి సహకరిస్తుందని ఈ అధ్యాయం వెల్లడిస్తున్నది. నిశ్చలమైన మనస్సుతో మనము మనకు నచ్చిన పుస్తకాన్ని చదువుతున్నప్పుడు, మధురమైన సంగీతాన్ని వింటున్నప్పుడు, తదేకధ్యాననిమగ్నుల మైనప్పుడు - ఏకాగ్రతవల్ల ప్రాణసంచారం స్తిమితమై ఉచ్ఛ్వాస నిఃశ్వాసలు సరళమవుతుండటం, ప్రాణసంచారం స్తిమిత మైనప్పుడు మనస్సు ప్రశాంతంగా ఉండటం మనకు తెలిసిన సంగతే. గాఢనిద్రలో ఉన్నప్పుడు, సమాధ్యవస్థలో ఉన్నప్పుడు ప్రాణసంచారం మాత్రమే ఉంటుంది. మనస్సుకు ప్రవృత్తి ఉండదన్నమాట. ఈ విధంగా మనఃప్రాణాల వాస్తవస్వభావాన్ని పరిశీలించినప్పుడు ఈ రెండింటినీ సమన్వయించే సూత్రాత్మ వేరొకటున్నదని స్పష్టపడుతుంది. ఋగ్వేదం (10.119.4)లో 'ఆ వేగచరిష్ణువు (అంటే వాయువేగంతో ప్రసరించే మనస్సు) ఆకసాన్ని ప్రవేశించి, విశ్వమంతటినీ దర్శింపగా, తదస్తిత్వాన్ని నేను నా కళ్లెదుటే చూడగలుగుతున్నాను; సవిత్రి అతనిని తనలోనికి, అతడు సవిత్రిని తనలోనికి తీసుకొంటారు' అని ఉన్న వాక్యం దీనికి ప్రమాణం. ప్రజాపతిసంహిత అనే గొప్ప గ్రంథంలో భార్య పూర్వరూపమని, భర్త పరరూపమని, కొడుకు సంధి అని, ప్రసూతి సంధికార్యమని ఉన్న ప్రమాణనిర్దేశంతో ఈ అధ్యాయం ముగుస్తున్నది. అదితిసంహిత కూడా ఇంతే. అదితి అంటే ఖండము లేనిది - అఖండము - అని అర్థం. తల్లి, తండ్రి, ప్రజ (సంతానం), ప్రజననం- సమస్తమూ అదితే. ఈ విధంగా తృతీయారణ్యకంలోని తొలి అధ్యాయం సాధకులు స్థూలజగత్తులోనుంచి సూక్ష్మజగత్తులోనికి, అపారమార్థికంనుంచి పారమార్థికానికి చేరుకొనేందుకు ఆవశ్యకమైన ధ్యానధారణ విధానాన్ని మనకు పరిచయం చేస్తున్నది.

ఆ తర్వాత రెండవ అధ్యాయం - వెనుక ఉదాహరించిన సంహితోపనిషత్తుకూ, ఈ తృతీయారణ్యకానికీ చరమభాగం. స్థవిరశాకల్యుడనే ఆచార్యుడు దేహము ఒక ఇల్లనుకొంటే ప్రాణము ఆ ఇంటి నడికప్పువంటిదని అంటాడు. కప్పుకు ఆధారమైన అడ్డుదూలం ఇంటికి ఆధారమైన నిలువుదూలంమీద నిలిచినట్లే, 'తద్యథా శాలావంశే సర్వేఽన్యే వంశాః సమాహితాః స్యురేవ మస్మిన్ ప్రాణే చక్షుః శ్రోత్రం మనో వా గింద్రియాణి శరీరం సర్వ ఆత్మా సమాహితః (3.2.1)' - చక్షుస్సు (కన్ను), శ్రోత్రము (చెవి), మనస్సు, వాక్కు, ఇంద్రియాలు - ఈ శరీరం మొత్తమూ ప్రాణాధారితమేనని ఆయన ఉద్దేశం. ఇక్కడ ప్రాణమంటే దేహాంతరితమైన చైతన్యమనే కాదు; సమస్త జీవకోటి గతివిధులకూ ఆలంబనమైన ఆత్మశక్తి అని అర్థం. ఆ తర్వాత అక్షరసమామ్నాయ రహస్యం, వత్సర ప్రమాణరహస్యం వివరింపబడ్డాయి. వర్ణమాలలోని ఊష్మములు ప్రాణానికి, స్పర్శములు అస్థికలకు, అచ్చులు మజ్జకు (ఎముకల లోని స్నిగ్ధపదార్థానికి), తురీయాంశం రక్తమాంసాలకు సంకేతాలు. ఈ విషయాన్ని బోధించినవాడు హ్రస్వ మాండూకేయుడు. శాకల్యుడు 'మూడు' అంకెను 360 భాగాలుగా విభజించాడు. ఇది ఒక యేడాదిలోని రాత్రింబవళ్లకు సంకేతం. 360 పగళ్లు, 360 రాత్రులు కలిగిన కాలానికి ఆత్మతో



తాదాత్మ్యం. ఇది స్థూలంగా చెబితే అర్థమయ్యే చిత్రణ కాదు. 'స ఏష అహః సంమానః చక్షుర్మయః శ్రోత్రమయః ఛన్దోమయః మనోమయః వాఙ్మయ ఆత్మా (3.2.1.)' - ఆత్మము అహోరూపం (పగలు). అదే చక్షుః శ్రోత్ర చ్ఛందో మనో వాక్కులతో కూడినదని చెప్పటం మనోవైజ్ఞానిక దృష్టికోణం. బ్రహ్మవిచారంలో వచ్చే ఆసక్తికరమైన విషయాలలో ఇదొకటి. ఆత్మమునకు వర్ణమాలతో తాద్రూప్యాన్ని నిరూపించినవాడు కౌంతరవ్యుడు. ఆయనకంటె లోతుగా వెళ్లినవాడు బాధ్వమహర్షి. ఆయన పలుకులలో ప్రతీకాత్మకత ఎక్కువ. గాథ ప్రతిభుడు ఆయన అంటాడు కదా, నలుగురు పురుషు లున్నారట: శరీరపురుషుడు, ఛందఃపురుషుడు, వేదపురుషుడు, మహాపురుషుడు - అని:

'చత్వారః పురుషా ఇతి బాధ్వః శరీరపురుషః ఛన్దః పురుషః వేదపురుషః మహాపురుష ఇతి. శరీరపురుష ఇతి య మవోచామ స య ఏవాయం దైహిక ఆత్మా, తస్య యోఽయ మశరీరః ప్రజ్ఞాత్మా స రసః. ఛన్దఃపురుష ఇతి యం అవోచామ యేన వేదాన్ వేద ఋగ్వేదం యజుర్వేదం సామవేదం, తస్యైతస్య బ్రహ్మ రసః. తస్మా దృ్త్విహ్మాణం బ్రహ్మిష్ఠం కుర్వీత యో యజ్ఞస్యోల్బణం పశ్యేత్, మహాపురుష ఇతి యం అవోచామ సంవత్సర ఏవ ప్రధ్వంసయ న్నన్యాని భూతాని ఐక్యా భావయన్ అన్యాని, తస్య ఏతస్య అసావాదిత్యో రసః. స యశ్చాయం అశరీరః ప్రజ్ఞాత్మా యశ్చాసావాదిత్యో ఏకమేతదితి విద్యాత్. తస్మా త్పురుషం పురుష ప్రత్యాదిత్యో భవతి. తదప్యేత దృషిణోక్తమ్

చిత్రం దేవానా ముదగాదనీకమ్ చక్షుర్మిత్రస్య వరుణ స్యాగ్నేః
ఆ ప్రా ద్యావాపృథివీ అన్తరిక్షం సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ.

ఇతి. ఏతాం అనువిధం సంహితాం సన్ధీయమానాం మన్యే ఇతి హ స్మాహ బాధ్వః ఏతం హి ఏవ బహ్వృచా మహత్యుక్థే మీమాంసన్తే, ఏతం అగ్నా అధ్వర్యవః, ఏతం మహావ్రతే ఛన్దోగాః, ఏతం అస్యామ్, ఏతం దివి, ఏతం వాయౌ, ఏతం ఆకాశే, ఏతం అప్సు, ఏతం ఓషధీషు, ఏతం వనస్పతిషు, ఏతం చన్ద్రమసి, ఏతం నక్షత్రేషు, ఏతం సర్వేషు భూతేషు, ఏతం ఏవ బ్రహ్మేత్యాచక్షతే. స ఏష సంవత్సరసమ్మానః చక్షుర్మయః శ్రోత్రమయః ఛన్దోమయః మనో మయః వాఙ్మయ ఆత్మా, స య ఏవం ఏతం సంవత్సరసమ్మానం చక్షుర్మయం శ్రోత్ర మయం ఛన్దోమయం మనోమయం వాఙ్మయం ఆత్మానం పరస్మై శంసతి దుగ్ధదోహా అస్య వేదా భవన్తి; న తస్యానూక్తే భాగోఽస్తి, న వేద సుకృతస్య పన్థానం ఇతి. తదప్యేత దృషిణోక్తమ్ -

య స్తిత్యాజ సఖివిదం సఖాయం న తస్య వాచ్యపి భాగో అస్తి
యదీం శృణోత్యలకం శృణోతి నహి ప్రవేద సుకృతస్య పన్థామ్.

ఇతి. న తస్యానూక్తే భాగోఽస్తి, న వేద సుకృతస్య పన్థాన మిత్యేత త్తదుక్తం భవతి. తస్మా దేవం విద్యా న్న పరస్మై అగ్ని చినుయాత్; న పరస్మై మహావ్రతేన స్తువీత; న పరస్మా ఏతదహః శంసేత్కామం పిత్రే వాచార్యాయ వా శంసేదాత్మన ఏవాస్య తత్కృతం భవతి.'



అని మూలం. తైత్తిరీయోపనిషత్తులో మనకు తెలిసినదే, అంత విశదంగా కాకపోయినా, సంక్షిప్తంగా ఇక్కడ చెప్పబడుతున్నది: దేనిని మనము శారీరకపురుషుడు అంటున్నామో - నిజానికి అక్షరసమామ్నాయమే అది - అకారం దాని సారం ('అక్షరాణాం అకారోఽస్మి' అని భగవద్గీత 10-33). వేదపురుషుడంటే - ఋగ్యజుస్సామాలు బ్రహ్మము దాని రసం. అందువల్లనే యజ్ఞకర్మకు ఉపక్రమించినప్పుడు దోషం ఏర్పడకుండా (ప్రాయశ్చిత్తం చేయవలసిరాకుండా) పర్యవేక్షింప గల విద్వాంసుని - వేద తదంగ పారంగతుడైన బ్రాహ్మణుని బ్రహ్మజ్ఞానిని - ఋత్విజునిగా నిలపాలి. ఇక, మహాపురుషుడంటే సంవత్సరమే: కాలధర్మానుసారం కొన్నిటిని నశింపజేసి మరికొన్నిటిని వర్ధిల్లజేసే చైతన్యోపలక్షణం. ఆదిత్యుడు దీని సారం. ఈ తీరున దేహోపాధిని కలిగిన ఆత్మకూ కాలానికీ తాదాత్మ్యకల్పన చేయటంలో ఉన్న పరమార్థ మేమిటో గ్రహించాలి. ఉపనిషత్తులు రచితమైన కాలంలో ఆనాటి మేధావులు కొందరు సృష్టికి కారణం కాలమేనని ప్రతిపాదించారు. ఈ సృష్టికర్తృత్వారోపణ వల్లనే వైదికవాఙ్మయంలో ప్రజాపతిని కాలసంజ్ఞతో వ్యవహరించటం మనకు కనిపిస్తుంది. ఆ మాటకు వస్తే భగవంతుడే కాదు ఏ వస్తువయినా 'ఉన్నది' అని అంగీకరించాలంటే 'కాలము' యొక్క ప్రమేయంవల్లనే ఆ పని జరుగుతున్నది. భగవంతుని ఉనికిని, సృష్టిస్థితిలయాదులను మనము నిరూపిస్తున్నది కాలపు పరిభాషలోనే కనుక విష్ణుపురాణం 'కాలస్వరూపీ భగవాన్' అన్నది. భగవానుడు కాలరూపాన అభివ్యక్తుడని దీని అర్థం. సృష్టికి మూలకారణం శక్తి అని విశ్వసించిన శాక్తేయులుకూడా ఈ ఉపనిషన్మతాన్ని దృష్టిలో ఉంచుకొనే, జగన్మాతను 'కాళి' (కాలీ కాలస్వరూపిణి) అని వ్యవహరించటం జరిగింది.

ఆదిత్యుని ఆధారంగానే అహోరాత్రప్రమాణం నిశ్చయింపబడుతున్నది గనుక సంవత్సరానికి ఆదిత్యుడు సారమనటం సమంజసంగానే ఉన్నది. అయితే కాలమన్నది బాహిరమే కాక ఆంతరంగికమూ; వాస్తవికమూ, వ్యక్తినిష్ఠమూ కావటంచేత కాలాన్ని అఖండ మన్నారు. కాలానికి మహాపురుషునితోనూ ఆదిత్యునితోనూ అభేదమని చెప్పారు. అశరీరమైన ప్రజ్ఞాత్మలోనూ, సశరీరుడైన ఆదిత్యునిలోనూ ఉన్నవాడు ఒక్కడే. ప్రతి పురుషుడూ ఆ ఆదిత్యుడే. ప్రతి పురుషుడూ దివ్యుడే. 'చిత్రం దేవానాం ..... తస్థుషశ్చ' అన్న భావాన్ని చూడండి: ప్రాతర్భజనీయమైన ప్రత్యక్షదైవం - మిత్రావరుణాగ్నుల చక్షుస్సు స్థావర జంగమాలన్నింటికీ (జగత్తు అంటే కదిలేది; తస్థుషం కదలిక లేనిది) ఆత్మ జాగరిత మయింది - అని దీని అర్థం. ఋగ్వేదాన్ని పఠించే (గాత = గానం చేసేవాడు) బహ్వృచులు ఆ ఆత్మస్వరూపుని మహాదుక్థమందు కనుగొనాలని తత్త్వవిచారం చేస్తారు. యజుర్వేదానుసారం యజ్ఞకర్మలను అనుష్ఠించే అధ్వర్యులు అగ్నియందు దర్శించాలని ప్రయత్నిస్తారు. సామప్రయోగనిపుణులైన ఛందోగులు మహావ్రతమందు అన్వేషిస్తారు. భూమియందు, దివమునందు, వాయ్వాకాశములందు, జలములందు, ఓషధీవనస్పతులందు, చంద్రునియందు, నక్షత్రాలలో, సర్వభూతాలలో ఆయన దర్శనీయుడు. ఆయననే బ్రహ్మమంటారు. సంవత్సర మందు మాననీయుడైన ఆ ఆత్మస్వరూపుడు చక్షుర్మయుడు, శ్రోత్రమయుడు, ఛందోమయుడు,



మనోమయుడు, వాఙ్మయుడు. ఆ విధంగా సర్వమయమైన బ్రహ్మమును దర్శించిన మహాపురుషుడు పురోహితుడై ఇతరుల కొఱకు ఆర్త్విజ్యానికి పాల్పడడు. వేదాధ్యయనం అతనికి ఐహికభోగాలను సంపాదించిపెట్టే వృత్తివిద్య కాదు. గురువే స్వయంగా బోధించినా బ్రహ్మవేత్తకు యజ్ఞకర్మలు, ఫలాకాంక్షలు నిర్నిమిత్తాలు. ఆచార్యులు నేర్పిన సకర్మకారాధనవిధానం అతనిని ఏ విధంగానూ నిర్బంధింపలేదు. కర్మారంభమే త్యజించినవారికి ఇక సత్కర్మ అనే విశేషంతో పనేముంటుంది? ఋగ్వేదం దశమ మండలంలో (71 6)లో కనుపించే భావం ఇదే: బ్రహ్మ జ్ఞానియైనవాడు (తనకే స్వర్గాపవర్గాలు అక్కరలేదనుకొన్నవాడు పొట్టకూటికోసమో, ఇతర ఫలాలకోసమో ఆశపడి) ఇతరులకొరకు అధ్వర్యువై, హోతయై, ఉద్గాతయై అగ్ని రగుల్కొల్పడు. అన్యుల నిమిత్తం మహావ్రతసామాలను స్తోత్రంచేయడు. ఆనాటి శాస్త్రవిధులను వేరొకరికోసం వినియోగింపడు. 'యస్తిత్యాజ సఖివిధం సఖాయం న తస్య వాచ్యపి భాగో అస్తి....' తన స్నేహితునికి ఏది శ్రేయస్కరమో ఎరుక కలిగిన స్నేహితుని వదులుకొన్నవారికి ఇక మంచి మాటల అవసరంలేదట. వారు వినేది కొరగాని పలుకులను; 'సత్కర్మ', 'సుకృతం' అంటే ఏమిటో వారికి తెలియదు అని. అయితే, తండ్రికొరకు, తన ఆచార్యుని కొరకు మహావ్రత స్తోత్రపాఠం చెయ్యవచ్చును; ఎందుకంటే తండ్రికి, గురువుకు చేసేది ఆత్మకృతమే అవుతుంది గనుక - అని వేదం అంటున్నది.

ఇదే సందర్భంలో బృహదారణ్యకం (5.5.2)లో ప్రసక్తమైన కొన్ని దుర్నిమిత్తాల (మృత్యువును సూచించే అపశకునాలు) ప్రస్తావన ఈ అధ్యాయంలో వచ్చింది. ఇక్కడ దాని ఆవశ్యకత ఏమిటో, ఈ ఆరణ్యకంలో దానికి ప్రవేశం ఎందుకు కలిగిందో చెప్పటం కష్టం. సూర్యుడు చంద్రునివలె కనిపించినప్పుడు, ఆకాశం మాంజిష్ఠ (ఎఱ్ఱటి ఎరుపు) వర్ణానికి మారినప్పుడు, వాయువును కుంభించటం (ఊపిరితిత్తులలో నిలుపుకొనటం) వీలుకానప్పుడు, శిరస్సునుంచి కాకోలపక్షి (బొంతకాకి) గూటివాసన వచ్చినప్పుడు - 'సమ్పరేతోస్యాత్మా న చిరం జీవిష్యతీతి విద్యాత్' మనిషి తన మృత్యువు సమీపంలోనే ఉన్నదని గ్రహించాలి. గ్రహించిన వెంటనే 'స యత్ కరణీయం మన్యేత తత్కుర్వీత యదన్తి యచ్చ దూరకే' - తన అవశ్యకర్తవ్యాలేమిటో వాటిని ముగించుకొని ఋగ్వేదంలోని 9.67. 21 27; 8 6 30; 9.13.6-11; 1.50.10 ఋక్కులను పఠించాలి. ఈ దుశ్శకునాలు ఇంకా ఉన్నాయి. సూర్యమండలం ఛిన్నాభిన్నమై బండిచక్రపు నడిమి దిమ్మెవలె అగుపించినప్పుడు; తన నీడలో తనకే చీలికలు కనబడినప్పుడు; నీటియందుకాని, దర్పణంలోకాని చూసినప్పుడు శిరస్సు లేనట్లు, వక్రంగా ఉన్నట్లు కానరావటం; కనులు మూయగానే దారపుపోగులు కనబడటం, కనులు విప్పగానే కనబడకపోవటం; చెవులు మూసుకొన్నప్పుడు చితిమంటల చిటపటలు, రథగమనధ్వానం; అగ్ని నెమలికంఠంవలె నీలంగా కనబడటం; నిర్మేఘమైన ఆకాశంలో మెరుపులు; కారుమబ్బుల నడుమ దివ్యకాంతులు; నిజంగా మెరుపు మెరిసినప్పుడు కళ్లకు కనబడకపోవటం; నేలంతా మండుతున్నట్లు అగ్నిశిఖలు కనబడటం; ఒక నల్లటివాడు అసితదంతాలవాడు తనను చంపుతున్నట్లు, అడవిపంది మీదకురికినట్లు, కోతి చేతిలో చచ్చిపోతున్నట్లు అనిపించటం; గాలికి



తేలిపోతున్నట్లుండటం; బంగారం నమిలి ఉమ్మి వేసినట్లు; తేనెను తాగుతున్నట్లు; దంటు నములుతున్నట్లు; చేతిలో ఒక్కటే చెంగల్వపువ్వు ఉన్నట్లు; ఎర్రటి పూలమాల వేసుకొని గాడిదలమీద, పందులమీద ఎక్కినట్లు; ఆవునెక్కి ఒక నల్లటి దూడతోపాటు దక్షిణానికి ప్రయాణిస్తున్నట్లు - ఈ దుస్స్వప్నాలన్నీ ఆసన్నమృత్యువుకు సూచనలని గ్రహించాలి. ఇటువంటి కలవచ్చిన మరుసటిరోజు ఉపవాసం ఉండి, దేవతలకు పాయసాన్ని వండి ఋగ్వేదం 127.6 లోని రాత్రిసూక్తం ఒక్కొక్క ఋక్కునే చదువుతూ నైవేద్యం సమర్పించాలి. పూజానంతరం బ్రాహ్మణులకు సంతర్పణచేసి, తానూ నైవేద్యాన్ని భుజించాలి.

పురుషతత్త్వావిష్కరణ చేస్తూ ఆకస్మికంగా విషయాంతరంలోనికి ప్రవేశించిన పాఠకుడు మళ్లీ ఇప్పుడు ఆధికారికేతివృత్తానికి తిరిగివస్తాడు. 'స య అతః ( అస్మాత్ దేహేన్ద్రియాది సఙ్ఘాతా ద్విలక్షణః) అశ్రుతః అగతః అమతః అనతః అదృష్టః అవిజ్ఞాతః అనాదిష్టః శ్రోతా మన్తా ద్రష్టా ఆదేష్టా ఘోష్టా విజ్ఞాతా ప్రజ్ఞాతా సర్వేషాం భూతానా మన్తర పురుషః స మే ఆత్మా ఇతి విద్యాత్.' 'సమస్త భూతజాతానికీ అంతర్యామియై ఉన్న పురుషుడు దేహేంద్రియాదులకంటె విలక్షణుడు. అంటే వేరైనవాడు. అశ్రుతుడు (వినబడనివాడు, శ్రుతి విషయభూతుడు కానివాడు అంటే తదతీతుడు), అగతుడు (చేరరానివాడు), అమతుడు (భావింపరానివాడు), అనతుడు (ఎవరికీ లొంగనివాడు), అదృష్టుడు (కనరానివాడు), అవిజ్ఞాతుడు (గ్రహింపరానివాడు), అనాదిష్టుడు (ఎన్నడూ ఆజ్ఞాపింపబడనివాడు) అయినప్పటికీ శ్రోత (వినేవాడు - అశ్రుతుడైనప్పటికీ శ్రోత అయినవాడు), మంత (భావించేవాడు), ద్రష్ట (చూచేవాడు), ఆదేష్ట (ఆదేశించేవాడు) - ఈ విధంగా సకల భూతాంతరుడైనవాడు - అతడే నాలోనూ ఆత్మయై ఉన్నవాడు' అని దీని భావం. ఆత్మతత్త్వాన్ని కరతలామలకం చేస్తున్న బృహదారణ్యకం 3.7.13, 8.11; కౌషీతకి 1.8; ప్రశ్న 4.6; కేన 4.18; నృసింహతాపిని 1.2 మొదలైన ఉపనిషత్తులలోని ప్రస్తావనల సారాంశమూ ఇదే.

ఆ తర్వాత ప్రసక్తనీయమైనది పరమగోప్యమైన అఖండ వాక్సిద్ధాంతం. ఇందులో పృథ్వి, అగ్ని, ఋగ్వేదం, చక్షువు, ప్రాణం అన్నవి స్పర్శములని; అంతరిక్షం, వాయువు, యజుర్వేదం, శ్రోత్రము, అపానము అన్నవి ఊష్మములని; ఆకాశము, సూర్యుడు, సామవేదం, మనస్సు, వ్యానము అన్నవి స్వరములని ప్రతిపాదింపబడింది. అక్షర సమామ్నాయాన్ని ఈ ప్రకారం సమాహృతంగా ధ్యానించే పద్ధతిని బోధించిన తర్వాత మానవదేహాన్ని వీణతో సరిపోల్చి, దైవీ శక్తి నివేశస్థానంగా అభివర్ణించిన తీరు హృదయావర్జకంగా ఉన్నది: 'అథ ఖలు ఇయం దైవీ వీణా భవతి, తదనుకృతి రసౌ మానుషీ వీణా భవతి. యథాస్య శిరః ఏవ మముష్యాః శిరః, యథాస్యాః ఉదరం ఏవం అముష్యాః, అమ్భృణం యథాస్మై జిహ్వా ఏవం అముష్యై; వాదనం యథాస్యాః తన్త్రయ ఏవాముష్యాః; అఙ్గులయో యథాస్యాః స్వరా ఏవం అముష్యాః స్వరాః, యథా అస్యా స్పర్శాః ఏవం అముష్యాః స్పర్శాః, యథాహ్యేవాయం శబ్దవతీ ఏవం అసౌ శబ్దవతీ; యథాహ్యేవేయం లోమశేన చర్మణా పిహితా భవతి ఏవం అసౌ లోమశేన చర్మణా పిహితా. లోమశేన హ స్మ వై చర్మణా పురా వీణా అపి దధాతి. సయో హ ఏతాం దేవీం వీణాం వేద



శ్రుతవదనో భవతి భూమిప్రా అస్య కీర్తి ర్భవతి. యత్ర క్వ చార్యా వాచో భాషన్తే విదు రేనం తత్ర' - అని. దీని భావం ఏమిటంటే, ఈ మానుషీవీణ ఉన్నదే, ఇది ఆ దైవీవీణ వంటిదే. దానికి శిరస్సు ఉన్నట్లే దీనికీ ఉన్నది; దీనికి ఉదరము, దానికి అంభృణిశక్తి; దీనికి జిహ్వ ఉన్నట్లే దానికీ రసన ఉన్నది; దీనికి అంగుళులున్నట్లే దానికి వాదనం; దీనికి స్వరాలున్నట్లే దానికీ స్వరాలు; దీనికి స్పర్శములున్నట్లే దానికీ స్పర్శము; ఇది శబ్దవతి, తర్మవతి, అయినట్లే అదీని. ఇది రోమములచే కప్పబడినట్లే అదీ రోమశం (ఆ రోజులలో వీణను కప్పిఉంచటానికి దట్టమైన వెంట్రుకలుగల చర్మాన్ని వాడేవారు) - అని ఈ విధంగా మానుషీ దైవీ వీణల పోలిక కొనసాగుతుంది. ఈ దైవీవీణాస్వరూపాన్ని గుర్తెరిగినవాడు ప్రసంగిస్తుంటే మరీమరీ వినాలనిపిస్తుందట. అతని కీర్తి నేల నాలుగుచెరగుల కలయప్రాకుతుంది. సభలలో అతని ప్రసంగాలు నలుగురినీ ఆకట్టుకొంటాయి.

అయితే సభలలో పుష్కలమైన వాక్చతురత్వం లేనివారి సంగతో? అటువంటివారు జపింపదగిన మంత్రం ఒకటున్నది: 'ఓష్ఠాపిధానాః న కులీ దన్తైః పరివృతా పవిః. సర్వస్యై వాచ ఈశానా చారు మా మిహ వాదయేత్' అని!

వాక్కుయొక్క సారం ఏమిటి? ఈ బోధనమే. ఈ ఆరణ్యకంలోని చివరిభాగంలో సంహితార్థాన్ని ణకార షకారముల ఆధారంగా ఒక నూత్నధోరణిలో సమన్వయించటం జరిగింది. ఈ సందర్భంగా కృష్ణహారీత, హ్రస్వ మాండూకేయ, స్థవిరశాకల్యుల దృక్పథాలు ప్రమాణీకరింపబడ్డాయి. కావషేయ ఋషుల గంభీరమైన తాత్త్వికభావనను పేర్కొనటంతో ఈ అధ్యాయం ముగుస్తున్నది: 'ఏతద్ హ స్మ వై త ద్విద్వాంసః ఆహుః ఋషయః కావషేయాః కిమర్థా వయ మధ్యేష్యామహే, కిమర్థా వయం వక్ష్యామహే, వాచి హి ప్రాణం జుహుమః ప్రాణే వాచం; యో హ్యేవ ప్రభవః స ఏవ అప్యయః' మనము వేదాలను ఎందుకు చదువుతున్నాము? యజ్ఞాలు దేనికి చేస్తున్నాము? ప్రాణాన్ని వాక్కులోనూ, వాక్కును ప్రాణంలోనూ యజిస్తున్నాము. ఎక్కడ మొదలుపెట్టామో, తిరిగి అక్కడికే వచ్చి చేరుతున్నాము అని. యజ్ఞయాగాలు, ఉపచారాలు, ఏ బాహ్యాడంబరాలూ లేని ప్రశాంతమైన ఐకాంతికమైన కేవలాత్మానుసంధాన రూపమైన ధ్యానధారణను ఈ అధ్యాయం ఉపదేశిస్తున్న దన్నమాట. సంహితార్థాన్ని వెల్లడించే పరమ రహస్యమైన ఈ అధ్యాయాన్ని గురుకులంలో ఏడాదిపాటు శుశ్రూష కావించి, తాముకూడా ఆచార్యులై ఇతరులకు విద్య నేర్పగోరిన విద్యార్థులకు మాత్రమే అంటే ఉపాధ్యాయులు కాగోరినవారికి మాత్రమే వారి దీక్షను, దక్షతను నానా విధాల పరీక్షించిన తర్వాత - తా ఏతాః సంహితా న అనన్తేవాసినే ప్రబ్రూయాత్ న అసంవత్సరవాసినే న అప్రవక్త్రే ఇత్యాచార్యా ఆచార్యాః - బోధించాలి.

చతుర్థారణ్యకంలో "మహానామ్ని" అనే శీర్షికతో వనౌకసులు పఠించే శ్లోకసంహతి ఉన్నది. వెనుకటి అధ్యాయాలతో పోలిస్తే ఈ శ్లోకాలలో చెప్పుకోదగిన విశేషాలేమీ లేవు. ఆశ్వలాయన గృహ్యసూత్రాల (7.12.10)లో వీటి ప్రయోగవిధానం అంతా ఉన్నది. ఇక పంచమారణ్యకంలో



మహావ్రతానుష్ఠాతలు మాధ్యందినసవనంలో పఠించే నిష్కైవల్యశాస్త్ర క్రమం ఉన్నది. ఈ భాగమంతా సూత్రశైలిలో రచింపబడింది. దీనిని ప్రథమారణ్యకానికి పరిశిష్టమని చెప్పవచ్చును.

శ్రీ శంకరాచార్యులవారు ద్వితీయారణ్యకంలోని 4 - 6 అధ్యాయాలను విడిచిపెట్టి మిగిలిన ఐతరేయారణ్యకమంతా క్రతుకలాపానికి, ధ్యానధారణకు ఆలవాలమని నిశ్చయించారు. ఇందులో పరమాత్మ తత్త్వావిష్కరణకంటె కర్మకాండకే అగ్రతాంబులం లభించింది. ఉపనిషత్తులు ప్రతిపాదించినది సమష్ట్యుపాధ్యుపహితమైన బ్రహ్మముయొక్క తత్త్వవిచారమని శాంకరదర్శనం. ప్రాణము, హిరణ్యగర్భుడు, ప్రజాపతి - అని బహుభంగుల ప్రమితమైన మాయోపాధిక పురుషతత్త్వాన్ని ధ్యానించటం వలన తత్తదధిదేవతల అనుగ్రహం మాత్రమే కలుగుతుంది; ఆత్మజ్ఞానం సిద్ధింపదు. శ్రీమచ్ఛంకరభగవత్పాదులు ఆత్మషట్కమని సంకలించిన ప్రస్తుతభాగం అధ్యారోప అపవాద రూపాన (అధ్యారోపము అంటే సచ్చిదానంద అనంత అద్వయ బ్రహ్మమునందు అజ్ఞానము మొదలైన సకల జడసమూహాన్ని ఆరోపించటం; ఆత్మవస్తువునందు అనాత్మపదార్థాన్ని ఆరోపించటం. అపవాదమంటే కారణమైనదానికంటె కార్యమైనది వేరుకాదనే నిశ్చయజ్ఞానం) ఈ సత్యాన్నే ఆవిష్కరిస్తున్నది. ఐతరేయోపనిషత్తు ప్రథమాధ్యాయంలోని ఉపాంతభాగం (ద్వితీయ ఖండం) వరకు బ్రహ్మమునందు జీవజగత్తులు ఆరోపింపబడుతున్న తీరు; ఆ తర్వాతి భాగంనుంచి పరమార్థదృష్టివలన ఈ మిథ్య మాయ లేక అజ్ఞానం (అజ్ఞానమంటే జ్ఞానం లేకపోవటం కాదు- విపరీత జ్ఞానం) తొలగిపోవటమూ అధికరింపబడ్డాయి.

**ఐతరేయోపనిషత్తు సారాంశం ఏమిటంటే**

(1) నిఖిల జగత్సారభూతమైనది ఆత్మ. (2) ఆత్మభిన్నమైన పదార్థం వేరొకటి లేదు. (3) ఈ ఆత్మయే ప్రజ్ఞానం (బ్రహ్మస్వరూపమైన చైతన్యం). (4) ఇంద్రుడు, ప్రజాపతి మొదలుకొని అత్యంత సూక్ష్మాణువుదాకా సమస్తమూ ఈ ఆత్మస్వరూపమే. (5) అద్వితీయ మైన ఈ ఆత్మతత్త్వాన్ని గ్రహించినవారు అమృతత్వాన్ని పొందుతారు. (6) ఇదే బ్రహ్మవిద్య.

బ్రహ్మవిద్యాభరణాయమానమైన ఈ గ్రంథంలో (1) ఉపక్రమము (ప్రతిపాద్యవస్తు తత్త్వావగాహనతో ఉపక్రమించటం); (2) ఉపసంహారము (తాత్పర్యనిర్ధారకమైన ముగింపు); (3) అభ్యాసము (ఆయా ప్రకరణాలలో ప్రతిపాదింపవలసిన విషయాన్ని క్రమంగా ప్రతిపాదించటం); (4) అపూర్వత (ఇతరప్రమాణాలతో నిమిత్తం లేకపోవటం); (5) ఫలము (విషయప్రయోజనాన్ని బోధించటం); (6) అర్థవాదం (ప్రకరణంలోని ప్రతిపాద్యవిషయాన్ని పునఃప్రశంసించటం) అనే షడ్విధలింగాలు ప్రకాశ్యార్థప్రకాశకాలుగా అనువర్తిల్లాయి. గ్రంథాదిని ప్రతిపాదింపబడిన ఆత్మే ('ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్') అంతంలో ప్రజ్ఞానబ్రహ్మముగా ('ప్రజ్ఞానం బ్రహ్మ. స ఏతేన ప్రజ్ఞేన ఆత్మనా...') నిరూపితమైనందువల్ల దీని సంపుటీకరణం సార్థకంగానే ఉన్నది. 'ఆత్మా వా ... ఏష బ్రహ్మ' మొదలైన ఏ వాక్యాన్ని తీసుకొన్నా ప్రధానవిషయం ఆత్మతత్త్వమే. ఈ విషయప్రతిపాదనలోని మౌలికతకూడా దీనిని ఉపనిషత్తుగా నిర్ణయించటం ఎంత ఔచిత్యభరితమో చెప్పకనే చెబుతున్నది.



ఈ ఆత్మజ్ఞానానికి ఫలం అమృతత్వసిద్ధి. ఆత్మము లోకాలను సృజించి, ఆ లోకాల లోనికే ప్రవేశించినదని చెప్పటం ఆత్మముయొక్క అద్వితీయతను నిరూపించటానికే. ఇదే ఆత్మపరమార్థం. 'తస్య త్రయ అవసథాః' అన్న దళంలో జాగ్రత్ స్వప్న సుషుప్త్యాదులందు కూడా ఆత్మప్రకాశకత్వమే అధికృతమైనందువల్ల ఉత్తమాధికారులకు ఈ గ్రంథం పరమాదరణీయ మనటంలో సందేహం లేదు. సంసారబంధముక్తులై అమృతత్వాన్ని సాధింపగోరినవారు దశోపనిషత్తులలో బ్రహ్మవిద్యాసారసంగ్రహరూపమైన ఐతరేయోపనిషత్తును తప్పక అధ్యయనం చెయ్యాలి.



## ఆదర్శ మిత్రుడు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులు

మేము ఇరువురమును చాలాకాలముగ స్నేహితులమై యుండుటచేత ఆయన, ఆయన శీలము, ఆయన సేవ, వీనిగురించి తగిన రీతిని వర్ణించుట నాకు కష్టము. విస్తారమై సత్కార్యాచరణమున అతడు చూపిన నిరాడంబరత్వము అప్రతిమానము. బలవంతుడు పేద అను భేదము చూడక పాత్రులయినవారు ఏ దర్జావారైనను ఈయన వారికి గావించిన ఎన్నో మేళ్లను వారికి ఇతనియందుకల కృతజ్ఞతాపూర్వకమైన అనురాగమును వీరికి ఉత్తమమైన స్మరణచిహ్నములు. ప్రాతకాలపు శీలములోని ఏ సుగుణములు మనము నేడు మరచిపోయి ఎక్కువెక్కువగా నష్టపడుచున్నామో అట్టి సుగుణముల యెడల ఇతడు వీడరాని భక్తి కనబరచినవాడు. స్నేహమునకు నిజమైన అర్థము నెరింగిన బహుకొద్దిమందిలో ఈయన గణింపదగినవాడు. స్వోత్కర్షాభిలాష లేక సత్యముగా పత్రికాప్రచురమునకును దేశమునకును సేవచేసిన వాడు. చూపునకు ఈయన బహుసాధువు కాని సునిశితమైన బుద్ధివైశద్య మితనికి గలదు. నిర్ణయముల చాకచక్య మున్నది. నైతికోత్సాహమును వితరణదృష్టియు గలవాడు. తెనుగు, సంస్కృతవాఙ్మయముల ఎడలను, హిందూ ఆదర్శముల ఎడలను, వీరికి తన్మయత్వము కలదు. వీరి జీవితమునకు ఈ ఆదర్శములే మార్గదర్శకతారలు.

శ్రీమాన్ యస్. శ్రీనివాస అయ్యంగారు ప్రఖ్యాత న్యాయవాది,
అఖిలభారత కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు.